# ANDHRA SREEBHASHYA.

# ఆంధ్రశ్రీభాష్యము.



భగవద్రామానుజాచార్యులవారిచే
బోధాయనవృత్త్యనుసారముగా రచియింపఁబడిన
బ్రహ్మసూత్రభాష్యము.

హానరెబిల్ శ్రీరాజా గోడేనారాయణగజపతిరాయనింగారి

సెలవుప్రకారము

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుఁగారిచేఁ
దెనుఁగుసేయఁబడి

వారిసెలవుప్రకారమె

ముద్రింపఁబడినది.

౫ సంచిక.

PUBLISHED BY

Sree Paravastu Sreenivasa Jagannadhaswami Ayyavaralugaru.

Printed by N. Subbarow at the Arsha Press.

Vizagapatam, 1890.

ష్టి కంఠెను ⌐ ~, (ఏయవినూరుగలవో) అనుక్రమమున జీవులరొుం
...ఆనందాతిశయమును జెప్పి (తై॥౨॥౯॥) యతోవాచోనివర్తన్తే। అప్రాప్యమనసా సహ। ఆనన్దంబ్రహ్మణో విద్వాన్ (మనస్సుతోఁగూడ వాక్కులుపొందలేక యెవ్వానినుండిమఱలుచున్నవో అట్టిబ్రహ్మముయొక్క ఆనందమును తెలిసికొనువాఁడు) అని పరబ్రహ్మముయొక్క కల్యాణగుణములుఅనంతములగుటను ఈశ్రుతి చెప్పుచున్నది-

౨౨. (తై॥౨॥౨॥౨॥) సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ। బ్రహ్మణా విపశ్చితా (సర్వజ్ఞుఁడగు బ్రహ్మముతోఁగూడ వాఁడు కామములనన్నిటిని పొందుచున్నాఁడు) అని బ్రహ్మజ్ఞానమునకు ఫలమును తెలియఁజేయుచున్న వాక్యము, సర్వజ్ఞుఁడగు పరబ్రహ్మమునకుగుణములు అనంతములగుటను చెప్పుచున్నది- విపశ్చితా బ్రహ్మణా సర్వాన్ కామానశ్నుతే (సర్వజ్ఞుఁడగు బ్రహ్మముతో అన్ని కామములనుపొందుచున్నాఁడు)- (కామ్యన్తే) కోరఁబడునవిగాన కామములు- అనఁగా కల్యాణగుణములు- బ్రహ్మముతోఁగూడ ఆగుణములనన్నిటిని పొందుచున్నాఁడు, అనియర్థము- దహరవిద్యలో (ఛా॥౮॥౧॥) తస్మిన్యదన్తస్తదన్వేష్టవ్యమ్ (దానియందు లోపల నేదియున్నదో అది వెదకఁబడఁదగినది) అనినట్లు, గుణములు ప్రధానములగుటను చెప్పుటకు సహ అనుశబ్దము ప్రయోగింపఁబడినది (సహ అనుశబ్దము అప్రధానమగుదానితోఁ జేర్పఁబడుచుండును- ఎట్లన్నను, పుత్రేణ సహ పితా ఆగతః = కొడుకును తోడ్కొని తండ్రి వచ్చెననుట- ఇచ్చట తండ్రి ప్రధానమైనవాఁడు- కొడుకు అప్రధానమైనవాఁడు) ఫలంబును ఉపాసనయును ఒక్కప్రకారముగానుండుట (ఛా॥౩॥౧౪॥౧॥) యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి (పురుషుఁడు ఈలోకముననెట్టి యుపాసనముకలవాఁడగునో ఈలోకమునుండి వెడలి అట్లు అగుచున్నాఁడు) అనుశ్రుతిచేత నేసిద్ధమైనది-

౨౮. (కే॥౨॥౩॥) యస్యామతం తస్య మతమ్ --- అవిజ్ఞాతం విజానతామ్ (ఎవనికి బ్రహ్మము పరిచ్ఛిన్నముగాఁ దలంపఁబడనిది అగుచున్నదో వానికి తలంపఁబడినది అగుచున్నది --- బ్రహ్మము పరిచ్ఛిన్నమని తెలిసికొనుచున్నవారలకు బ్రహ్మము తెలియఁబడనిదియె) అని, బ్రహ్మ

అనియద్వైతులు చెప్పుదురు- ఆ శ్రుతులచేత, సమస్తమైనను బ్రహ్మమునకు కార్యమగుటచేతనను బ్రహ్మము అంతర్యామిగాఁ గలదగుటచేతనను, బ్రహ్మాత్మకమగుటను బట్టి ఒక్కటిగాన, అట్లు ఒక్కటియగుటకు విరుద్ధమగు అనేకత్వము నిషేధింపఁబడుచున్నది (తై॥ఆన॥౬॥) బహుస్యాం ప్రజాయేయ (నేను అనేకముగా వలయును, పుట్టవలయును) అని శ్రుతిసిద్ధమైన అనేకము కావలయునను సంకల్పము పైని గలిగిన బ్రహ్మముయొక్క అనేకత్వము నిషేధింపఁబడుటలేదు- అనేకత్వము నిషేధింపఁబడుటవలన ఈ శ్రుతి అపరమార్థమైన అనేకత్వమును చెప్పుననుట యుక్తము కాదు- ప్రత్యక్షాదిప్రమాణములన్నిటిచేతను తెలియఁబడనిదై బుద్ధిచేతను ఊహింపశక్యము కానిదైన అనేకత్వము బ్రహ్మమునకు తెలియఁజేయఁబడి, అదియె నిషేధింపఁబడుచున్నదన్నమాట నవ్వఁదగియున్నది-

ల౨. (తై॥౨॥౭॥౨॥) యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే। అథ తస్య భయం భవతి। అని బ్రహ్మమునందు అనేకత్వమును తెలిసికొనువానికి భయము కలుగునని చెప్పినది యుక్తము కాదు- (ఛా॥౩॥౧౪॥౧॥) సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత (ఇది అంతయు బ్రహ్మము కదా- దానివలనఁ బుట్టినదియు దానిలో లయమగునదియు దానివలన జీవించునదియునని శాంతుఁడై ఉపాసన చేయవలయును) అని బ్రహ్మముయొక్క అనేకత్వానుసంధానము శాంతికి హేతువుగాఁ జెప్పఁబడినది- ఎట్లన్నను, సమస్తమైన జగత్తును, ఆతఁడు కలుగఁజేసెడు ఉత్పత్తిస్థితిలయములను (పుట్టుక ఉనికి నశించుట అనువానిని) పొందునదియగుటను, ఆతండె ఆత్మకుడిగా అనుసంధించుటచేత శాంతి కలుగునని ఈ విద్యలో విధింపఁబడుచున్నది- కాఁబట్టి దేవతలు తిర్యక్కులు మనుష్యులు స్థావరములు మొదలగు భేదములుగల జగత్తును బ్రహ్మాత్మకమని అనుసంధానము చేయుట, శాంతికి హేతువగుటను అభయము కలుగుటకే హేతువుగాన, నానాత్వానుసంధానము భయహేతువగుటకు ప్రసక్తియె లేదు- అట్లైనచో, అథ తస్య భయం భవతి, అనియేమి చెప్పఁబడును? అంటిరేని, చెప్పెదము-(తై॥౨॥౭॥౨॥) యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విం

దతే। అథసోఽభయంగతో భవతి (చూడఁబడని వాఁడును అశరీరుఁడు
ను దేవాదిశబ్దములచేఁ జెప్పఁబడని వాఁడును ఆధారము లేనివాఁడును
అగు ఈతని యందు, వీఁడు అనఁగా ఉపాసకుఁడు, భయము లేకపోవుట
కొఱకు, నిలకడను అనఁగా అవిచ్ఛిన్నముగాఁ దలంచుటను ఎప్పుడు పొందు
చున్నాఁడో, అటుపైని, వాఁడు అభయమును పొందినవాఁడు అగుచు
న్నాఁడు-) అని యభయమును పొందుటకు హేతువుగాఁ జెప్పఁబడిన బ్ర
హ్మమునందలి నిలుకడ ఏదికలదో దానికి విచ్ఛేదము అనఁగా యెడ
తెఱపి గలిగినయెడను భయము కలుగును అని ఈ శ్రుతిచేతఁ జెప్పఁ
బడుచున్నది- ఈ యంశము మహర్షులచేతఁ గూడఁ జెప్పఁబడినది-
(          )యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చిన్త్యతే।
సాహానిస్తన్మహచ్ఛిద్రం సా భ్రాన్తిః సా చ విక్రియా (ఒక ముహూర్త
ముగాని క్షణముగాని భగవంతుఁడు తలంపఁబడకపోవుట యేది కలదో అది
హాని- అది గొప్ప ఛిద్రము- అదియే భ్రాంతి- అదియే వికారము) ఇది మొదలగు
వచనములు కలవు- బ్రహ్మమునందలి ప్రతిష్ఠయొక్క అంతరమనఁగా అవ
కాశము అనఁగా విచ్ఛేదమే-

౮౩. (౩అ॥ ౨పా॥ ౧౧సూ॥) న స్థానతోఽపి అను సూత్రముచేత బ్ర
హ్మము విశేషము లెవ్వియు లేనిదని సూత్రకారుఁడు చెప్పెననుట యుక్తము
కాదు- ఆ సూత్రమున బ్ర[illegible] విశేషములు కలవనియే చెప్పెను- (౩అ॥ ౨పా॥
౩సూ॥) మాయామాత్రం [illegible] అను సూత్రముచేత, స్వప్నములోని పదార్థ
ములు, జాగ్రదవస్థలో ననుభవింపఁబడిన వానికంటె విలక్షణముగా నుం
డును గాన మాయామాత్రమని చెప్పఁబడును, అని యిట్లు, జాగ్రదవస్థ
యందనుభవింపఁబడినవివలె పారమార్థికములగుటనే చెప్పెను-

౮౪. స్మృతులలోనను పురాణములలోనను విశేషము లేమియు
లేని జ్ఞానమాత్రమే పరమార్థము (సత్యము) అనియు, మిగిలినది
అపారమార్థికము (అసత్యము) అనియు తెలియఁబడుచున్నదనుట యున
యుక్తమే-

(భ॥ ౧౦॥ ౩॥) యోమామజమనాదించ వేత్తి లోకమహేశ్వరమ్
(పుట్టుక లేనివాఁడనును ముక్తులకువలెనాది లేనివాఁడనును లోకముల క
న్నిటికిని గొప్ప ఈశ్వరుఁడనునగు నన్ను ఎవఁడెఱుంగునో-)

(భ॥౯।౪---౫॥) మత్స్థానిసర్వభూతానినచాహంతేష్వవస్థితః। నచమత్స్థానిభూతానిపశ్యమెయోగమైశ్వరమ్। భూతభృన్నచభూతస్థోమమాత్మాభూతభావనః।(అన్నిభూతములును అంతర్యామినైననాయందున్నవి- నేనువాటియందులేను; అనఁగా నాయునికివానికిఆధీనమైనదకాదనుట- భూతములునాయందున్నవికావు- అనఁగా, కుండ నీటిని ధరించునటు నేనవాటిని ధరించుటలేదు- మఱియెట్లన్నను, నాసంకల్పముచేత ధరించుచున్నాఁడను- నాయొక్క- ఈశ్వరసంబధమైన అనఁగా మఱియెవ్వనియందును లేనియోగమును చూడుము- ఆయోగమెట్టిదన్నను, నేనుభూతములనుపోషించువాఁడను- భూతములయందున్నవాఁడను కాను అనఁగా వానివల్లనాకేమియు నుపకారము లేదనుట- నాయొక్క సంకల్పమె భూతములను కలుగఁజేయునదిఅనఁగా ధరించునదియు నియమించునదియు ననుట)

(భ॥౭॥౭॥)అహంకృత్స్నస్యజగతః ప్రభవః ప్రళయస్తథా। మత్తః పరతరంనాన్యత్కించిదస్తిధనఞ్జయ। మయిసర్వమిదంప్రోతంసూత్రేమణిగణాఇవ ( నేను సమస్తమైన జగత్తునకును ఉత్పత్తిస్థానమైనవాఁడనును ప్రళయస్థానమైనవాఁడనను- ఓయర్జునుఁడా నాకంటెగొప్పది మఱియొక్కటియుదయును లేదు- ఇదయంతయును సూత్రమునందుమణులవలె నాయందుగ్రుచ్చఁబడియున్నది-)

(భ॥౧౦॥౪౨॥) విష్టభ్యాహమిదంకృత్స్నమేకాంశేనస్థితోజగత్ ( నేను ఈజగత్తునంతయు ఒక్క-యతిస్వల్పమైన భాగము చేతనుపట్టియున్నాను)

(భ॥౧౫॥౧౭---౧౮॥)ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః। యోలోకత్రయమావిశ్యబిభర్త్యవ్యయ ఈశ్వరః।యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపిచోత్తమః।అతోస్మిలోకే వేదేచప్రథితఃపురుషోత్తమః(బద్ధులకంటెనను ముక్తులకంటెనను అన్యుఁడైనగొప్పపురుషుఁడుపరమాత్మయనిచెప్పఁబడును-ఎవ్వఁడు మూడులోకములను అనఁగా ప్రకృతి, ప్రకృతిసంపర్కముగలజీవుఁడు, ముక్తుఁడు, అనుమూఁడుపదార్థములనునుఆత్మగానుండిప్రవేశించిపోషింపుచున్నాఁడో, ఎవ్వఁడునశింపనివాఁడును ఈశ్వరుఁడునో- నేను, ఎందువలన

ష్టజీవునిఅతిక్రమించినవాఁడనో, ముక్తునికంటెనుగొప్పవాఁడనో, ఇం ముపలన లోకమునందును వేదమునందును పురుషోత్తముఁడనని ప్రసిద్ధుఁ డనగుచున్నాను)

(విష్ణు|| ౬|| ౫|| ౮౩ - ౮౭||) స సర్వభూతప్రకృతింవికారాన్ గుణాదిదోషాంశ్చమునేవ్యతీతః। అతీతసర్వావరణోఽఖిలాత్మా తేనాస్తృతం యద్భువనాన్తరాళే ||౧|| సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ స్వశక్తిలేశావృతభూతసర్గః। ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేషజగద్ధితోఽసౌ ||౨|| తేజోబలైశ్వర్యమహావబోధసువీర్యశక్త్యాదిగుణైకరాశిః। పరఃపరాణాంసకలానయత్రక్లేశాదయస్సంతిపరావరేశే ||౩|| స ఈశ్వరోవ్యష్టిసమష్టిరూపోఽవ్యక్తస్వరూపఃప్రకటస్వరూపః। సర్వేశ్వరస్సర్వదృక్సర్వవేత్తాసమస్తశక్తిఃపరమేశ్వరాఖ్యః ||౪|| సంజ్ఞాయతేయేనతదస్తదోషంశుద్ధంపరం నిర్మలమేకరూపమ్। సందృశ్యతే వాప్యధిగమ్యతే వాతజ్జ్ఞానమజ్ఞానమతోఽన్యదుక్తమ్ ||౫|| (ఓమైత్రేయుఁడా! ఆతఁడుసమస్తభూతములకుకారణమైన ప్రకృతినిని మహత్తత్త్వము మొదలగువికారములనుసత్త్వరజస్తమోగుణములు మొదలగుదోషములనుఅతిక్రమించినవాఁడు- ఆవరణములన్నిటిని దాఁటినవాఁడు- అంతటికిఆత్మయైనవాఁడు- లోకములమధ్యమున నుండెడుదానిగలదో అది ఆతనిచేతవ్యాపింపఁబడినది||౧|| ఈతఁడు అశేషకల్యాణగుణములకుస్వభావముగాఁగలవాఁడు- తనయొక్కశక్తిలేశముచేతధరింపఁబడిన భూతసృష్టికలవాఁడు- తనయిచ్ఛచేగ్రహింపఁబడినఇష్టమైనగొప్పశరీరము కలవాఁడు- ఈతఁడుసాధింపఁబడినసమస్తలోకములయొక్కహితము కలవాఁడు-||౨|| తేజస్సుబలముఐశ్వర్యముగప్రజ్ఞానముసుందవీర్యము శక్తిమొదలగుగుణములయొక్కపోగైనవాఁడు- గొప్పవారికిగొప్పవాఁడు- గొప్పవానికిదిగువవానికినిఅన్నిటికినిఆత్మయైనవాఁడు- ఈశ్వరుఁడైన ఎవ్వనియందుక్లేశము మొదలగునవి లేవో||౩|| ఆయీశ్వరుఁడువ్యష్టియనఁగా సృజింపఁబడిన యవస్థలోనుండెడి జీవుఁడుశరీరముగాఁ గలవాఁడు- సమష్టియనఁగా సృజింపఁబడనియవస్థలోనుండెడి జీవసముదాయము శరీరముగాఁగలవాఁడు- తెలియఁబడనిస్వరూపముగలవాఁడు- వ్యూహాదిరూపములచేత స్ఫుటమైన స్వరూపముకలవాఁడు-

అన్నిటిని నియమించువాఁడు- అన్నిటిని చూచువాఁడు- అన్నిటిని నేలుంగువాఁడు- అన్నిశక్తులుఁ గలవాఁడు- పరమేశ్వరుఁడను పేరుగలవాఁడు ||౪|| కాఁబట్టి ఆతఁడు దేనిచేత తెలియఁబడునో ఉపాసనారూపమైనదేనిచేత చూడఁబడునో, దోషములులేనిదియు పరిశుద్ధమైనదియు మిక్కిలి నిర్మలమైనదియు ఒక్కవిధమైనదియునగు అదియె జ్ఞానము- దీనికంటె నితరమైనది అజ్ఞానమని చెప్పఁబడును )||౫||

(విష్ణు||౬||౫||౭౨ --- ౭౫||) శుద్ధే మహావిభూత్యాఖ్యే పరే బ్రహ్మణి శబ్ద్యతే। మైత్రేయ భగవచ్ఛబ్దస్సర్వకారణకారణే||౧|| సంభర్తేతి తథా భర్తా భకారోఽర్థద్వయాన్వితః। నేతాగమయితా స్రష్టా గకారార్థస్తథా మునే||౨|| ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా||౩|| వసన్తి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని। స చ భూతేష్వశేషేషు వకారార్థస్తతోఽవ్యయః||౪|| (ఓ మైత్రేయుఁడా ఎల్లప్పుడును పరిశుద్ధుఁడైనవాఁడును మహావిభూతియను పేరుగలవాఁడును అన్నికారణములకును కారణమైనవాఁడునగు పరబ్రహ్మమునందు భగవచ్ఛబ్దము చెప్పఁబడుచున్నది||౧|| ఉపకరణములను కూర్చువాఁడును అట్లె స్వామియును నిభకారము రెండర్థములతోఁ గూడినది- ఓ మునీ! రక్షించువాఁడును సంహరించువాఁడును సృజించువాఁడును నని అట్లె గకారార్థము||౨|| సంపూర్ణమైన ఐశ్వర్యమునకును వీర్యమునకును కీర్తికిని సంపదకును జ్ఞానంబునకును వైరాగ్యంబునకును, ఈయాఱింటికి భగమనెడిమాట చెల్లుచున్నది||౩|| భూతములకు ఆత్మమైనవాఁడును అన్నియును శరీరముగాఁగలవాఁడునగు ఆతనియందు భూతములు నివసించియున్నవి- ఆతఁడుగూడ అన్నిభూతములయందును ఉన్నాఁడు- కాఁబట్టి నిర్వికారుఁడైన ఈశ్వరుఁడు వకారార్థము||౪||)

(విష్ణు||౬||౫||౭౯||) జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః। భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః|| (సంపూర్ణముగా జ్ఞానము శక్తి బలము ఐశ్వర్యము వీర్యము తేజస్సు అనునవి దుష్టమైన గుణములు మొదలగునవి కాక, భగవచ్ఛబ్దముచేతఁ జెప్పఁబడునవి)

(విష్ణు||౬||౫||౭౬ --- ౭౭||) ఏవమేష మహాశబ్దో మైత్రేయ

లేనిపురుషులెవ్వరును చూడనిపర్వతగుహలో నివసింపుచున్నవారును, త మకుఁదిమిరదోషమున్నదనిఎఱుఁగనివారునునగుకొందఱుతిమిరదోషము గలవారలకుఅందఱకును ఒక్క విధముగానే చంద్రులుఇద్దఱుఅనేడిజ్ఞాన ముకలుగుచున్నది-అచ్చట బాధకజ్ఞానము లేఁపోయినంతమాత్రముచేత అదిఅసత్యముకాకపోవుట లేదుగాన అజ్ఞానమునకు విషయమైనద్విచం ద్రత్వము (ఇద్దఱుచంద్రులుకలుగుట) గూడఅసత్యమే- అయథార్థ- జ్ఞానమగుటకు హేతువుదోషమేకదా- అట్లే బ్రహ్మజ్ఞానముగూడ అవిద్యామూలకముగాన తనకువిషయమగు బ్రహ్మముతోఁగూడ నస త్యమె కావలయును- ఈవిషయమున ప్రయోగములు(ప్రసంగతర్కము లు) గూడఁగలవు-వివాదాస్పదమైనబ్రహ్మము అసత్యము; అవిద్యగల వానికి పుట్టినజ్ఞానమునకు విషయమగుటను; ప్రపంచమువలెనే-బ్ర హ్మము అసత్యము; జ్ఞానమునకు విషయమగుటవలన; ప్రపంచము వలెనే- బ్రహ్మము అసత్యము;అసత్యమైనహేతువువలనఁగలిగినజ్ఞా నమునకు విషయమగుటను;ప్రపంచమువలెనే-

౮౪- స్వప్నమునందలి యేనుఁగు మొదలగువాని జ్ఞానము అ సత్యమైనను సత్యమైన శుభాశుభజ్ఞానమునకుహేతువగునట్లే అవి ద్యామూలకమగుటచే నసత్యమైన శాస్త్రముగూడ పరమార్థమైన బ్రహ్మమును గురించిన జ్ఞానమునకు హేతువగుట విరుద్ధము కాదు అని చెప్పఁగూడదు- ఎందువల్లనంటేని, స్వప్నమునందలి జ్ఞానము అ సత్యముకాదు- అందువిషయములకేకదా మిథ్యాత్వము- వానికే కాని జ్ఞానమునకు బాధకనఁబడుట లేదుగదా- నేనుస్వప్నవేళను అనుభ వించిన జ్ఞానముగూడ లేదని ఎవ్వనికైనందోఁచుట లేదుగదా- జ్ఞానమ యి తేనున్నది, అర్థములు లేవు,అనికదా బాధకజ్ఞానము- మాయఁ జేయువానియొక్క మంత్రౌషధాదులవలనఁగలిగినమాయామయజ్ఞా నముగూడ సత్యమైయుప్రీతికిని భయమునకును హేతువగుచున్నది- అ చ్చట జ్ఞానముగూడబాధింపఁబడలేదు- విషయములు ఇంద్రియములు మొదలగు వానిదోషమూలనగలిగిన త్రాడు మొదలగు వానియందలి సర్పాది జ్ఞానముసత్యమేమై భయము మొదలగు దానికి హేతు వగుచున్నది- తానుకఱవఁబడకపోయినను సర్పముదగ్గఱనుండుటవల

న తానుకలవఁబడినట్లు కనఁబడెడి జ్ఞానము సత్యమైనదే. మరణమునకు కారణమైన శంకావిషజ్ఞానముగూడ సత్యమైనదే. వాస్తవమైన జలాదులయందు ముఖము మొదలగునది కనఁబడుటగూడ వాస్తవముగా ముఖమునందుండెడి విశేషమును నిశ్చయించుటకు హేతువైనదే. ఈజ్ఞానములు పుట్టుకకలవగుటను కార్యకరములగుటను సత్యత్వము నిశ్చయింపఁబడుచున్నది. ఏనుఁగు మొదలగునవి లేనియప్పుడు వానిజ్ఞానములుమాత్రము సత్యమగుటయెట్లు?, అంటిరేని, అదియుక్తముకాదు. జ్ఞానములకు విషయముకలిగియుండుట మాత్రమెకావలసినది. వస్తువు తెలియఁబడుటయె విషయమగుటకు కావలసినది. ప్రకృతమున దోషవశమువల్ల తెలియఁబడుట(స్ఫురించుట) కలిగియెయున్నది. అది(విషయము)బాధింపఁబడినదిగాన అసత్యమని నిశ్చయింపఁబడుచున్నది. బుద్ధిబాధింపఁబడలేదుగాన సత్యమెయనిచెప్పఁబడినది.

౭౫. రేఖచేత(లిపిచేత)వర్ణములను తెలిసికొనునప్పుడుగూడ అసత్యమునుపట్టి సత్యమును తెలిసికొనుటలేదు. ఎందుచేతనంటేని, రేఖ సత్యమె. వర్ణస్వరూపముగాఁ దెలియఁబడిన రేఖగదా వర్ణజ్ఞానమునకు హేతువు, వర్ణస్వరూపమగుట యసత్యముగాదా యంటిరేని, అట్లుకాదు. అసత్యమైన వర్ణస్వరూపత్వము ఇచ్చట నుపాయమగుటలేదు. లేనిదియు తెలియఁబడనిదియును ఉపాయమగుట కనఁబడదు. ఉపపన్నముసయితముగాదు. ఇఁకను ఆరేఖయందలివర్ణజ్ఞానముకారణమన్నను, ఆసత్యమునుపట్టి సత్యజ్ఞానములేదు. వర్ణజ్ఞానముసత్యమెకదా. ఇదికాక ఉపాయంబును (సాధనంబును) ఉపేయంబును (సాధ్యంబును)ఒక్కటియే కావలసివచ్చును. రెండునువర్ణజ్ఞానములగుటలో విశేషములేదుగదా. రేఖతనయందులేని వర్ణస్వరూపముచేతనే ఉపాయమగునెడల ఒక్కరేఖయె తనయందులేని అన్నివర్ణముల స్వరూపమగుట సులభముగాన, ఒక్కరేఖను చూచినతోడనే అన్నివర్ణంబుల జ్ఞానమును కలుగవలయును. ఇఁకను ఒక్కొక్క శరీరమందు దేవదత్తుఁడు మొదలగుసంకేతములను చేసినట్లె కంటిచేగ్రహింపఁదగిన ఒక్కొక్కరేఖయందు చెవిచేతగ్రహింపఁదగిన ఒ

క్కొక్కవర్ణముయొక్క సంకేతమునుబట్టి ఒక్కొక్క రేఖ ఒక్కొక్క వర్ణజ్ఞానమునకు హేతువగునంటిరేని, సరియె- అప్పుడు సత్యమైన దానివలననే సత్యజ్ఞానము కలిగినది- రేఖయును సంకేతంబును సత్యములే కదా- రేఖాగవయమును (గొఱపోతుచిత్తరువును) పట్టి సత్యమైనగవయము తెలియుటగూడ సాదృశ్యమును (సాటిని) పట్టి వచ్చినదె- సాదృశ్యము సత్యమె.

౬౬. శబ్దమొక్కటియేయయి ధ్వనివిశేషములచేతను అర్థవిశేషముల జ్ఞానమునకు హేతువైనను అసత్యమును పట్టి సత్యము తెలియఁబడుట లేదు- అనేకధ్వనులచే నభివ్యక్తమగు నొక్క శబ్దమె ఆయా ధ్వనిచేత అభివ్యంగ్యమగు స్వరూపమునుబట్టి అర్థవిశేషములతోడి సంబంధమును గ్రహించుటవలన అర్థభేదముల జ్ఞానము పుట్టుటకు హేతువగును-

౬౭. శబ్దమొక్కటియగుటయును యుక్తముకాదు- అర్థమును తెలియఁజేసెడి గకారము మొదలగునదియె చెవిచేత గ్రహింపఁబడును గాన అదియె శబ్దము- కాఁబట్టి అసత్యమైన శాస్త్రమునుబట్టి సత్యమైన బ్రహ్మమునుగూర్చిన జ్ఞానము కలుగుననుట ఉపపాదింప శక్యముకానిది-

౬౮. శాస్త్రము ఆకాశపుష్పమువలె నసత్యముకాదు; అద్వైతజ్ఞానము కలుగకముందు సత్యమెయని తెలియఁబడును; తత్త్వజ్ఞానము కలిగినపైని గదా శాస్త్రము అసత్యమగుట; అప్పుడు శాస్త్రము అన్నిభేదములు లేని జ్ఞానమాత్రమైన బ్రహ్మము తెలియుటకు సాధనము కాదు; ఎప్పుడు సాధనమగునో అప్పుడు శాస్త్రముండనే యున్నది; కలదనియే కదా తెలియఁబడుచున్నది; అనియందురు- ఇదియుక్తము కాదు- శాస్త్రము లేనియప్పుడు శాస్త్రము కలదనియెడి జ్ఞానము అసత్యమే కదా- అయిననేమి యంటిరేని,- దీనివలన నిదిలభించును- అసత్యమైన శాస్త్రమువలనఁ గలిగిన జ్ఞానము అసత్యము గాన, దానికి విషయమైన బ్రహ్మమునకుఁగూడ అసత్యత్వము వచ్చును- ఎట్లంటేని, పొగగా గ్రహింపఁబడిన ఆవిరివలనఁ గలిగిన అగ్ని జ్ఞానము అసత్యము గాన, ఆ జ్ఞానమునకు విషయమైన అగ్నిగూడ నసత్యమె- తనకుఁ దరువాతను బాధ

కనఁబడకపోవుటయేనునదిసిద్ధింపదు శూన్యమె తత్త్వమనెడి వాక్యము చేత దానికిఁగూడ బాధకనఁబడుచు నేయున్నది-అది భ్రాంతిమూలకమంటివేని,ఇదియును భ్రాంతిమూలకమని నీవెచెప్పితివి- తరువాత బాధ లేకపోవుటయేయో,దానికె- ఇట్లు నిలువని కుయుక్తులను పరిహసించుట యింతతోఁజాలును-

౬౯. (ఛా॥౬॥౨॥౧॥) సదేవసోమ్యేదమగ్రఆసీత్ (ఈజగత్తు మొదటను సత్తే అయియుండెను) అనునది మొదలగు వేదాంతవాక్యములు,విషయమేమియు లేనిదియు జ్ఞానమొక్కటియె స్వరూపముగాఁగలదియునగు వస్తువును మాత్రమె తెలియఁజేయునవి, అనుటయును యుక్తముకాదు- ఒకటి తెలియుటచేత నన్నియును దెలియును అనెడి ప్రతిజ్ఞను ఉపపాదించెడిదైనను, సత్ అని చెప్పఁబడెడి పరబ్రహ్మము జగత్తునకు ఉపాదానమగుటయును నిమిత్తమగుటయును సర్వజ్ఞుఁడగుటయును సర్వశక్తులు కలవాఁడగుటయు సత్యసంకల్పుఁడగుటయు అన్నిటిలోను నుండుటయు అన్నిటికి నాధారమగుటయు అన్నిటిని నియమించుటయునను నివి మొదలుగాఁగల అనేక కల్యాణగుణములతోఁగూడియుండుటనును, జగత్తంతయును ఆతనిని ఆత్మగాఁగలిగియుండుటనును తెలియఁజేసి, ఇట్టి బ్రహ్మము ఆత్మగాఁగలవాఁడవునీవు అగుచున్నావు అని శ్వేతకేతువునుగూర్చి ఉపదేశించుటకు ప్రవర్తించినది గదా యాప్రకరణము- ఈయంశము వేదార్థసంగ్రహమున విస్తరింపఁజేయఁబడినది- ఈగ్రంథమునఁగూడ ఆరంభణాధికరణమున (౨అ॥౧పా॥౧౫సూ॥) లెస్సగా నుపపాదింపఁబడును-

౭౦. (ము॥౧॥౧॥౫॥) అథపరా యయాతదక్షరమధిగమ్యతె (ఇంకపరవిద్య, దేనిచేతఆయక్షరము తెలియఁబడునో) అనుచోటఁగూడ ప్రకృతిసంబంధులగు చెడుగుణములను నిషేధించినిత్యత్వము (కాలపరిచ్ఛేదము లేనిదగుట), విభుత్వము (దేశపరిచ్ఛేదము లేనిదగుట), సూక్ష్మత్వము సర్వగతత్వము (సూక్ష్మమైనదగుట, దీనిచేతనె అన్నిటిలో నుంజొచ్చియుండుట), అవ్యయత్వము (నాశము లేనిదగుట), భూతయోనిత్వము (సమస్త భూతములకును ఉపాదానకారణమగుట), సర్వజ్ఞత్వము (అన్నిటి నెఱుంగువాఁడగుట), ఇవి మొదలగు కల్యాణగుణములు క

ములయందుండెడి భేదము లేనిదగుటచేత ఆ ప్రకృతిపరిణామముల భేద
ములను చెప్పెడి దేవాది శబ్దములకు విషయముకాదనియు, జ్ఞానము
గానుండుటయే స్వరూపముగాఁ గలదనియు, తనకుఁదానె తెలియఁబడు
నదియనియు, యోగాభ్యాసము చేయువారి మనస్సునకు గోచరముకా
దనియు, చెప్పఁబడుచున్నది- కాఁబట్టి ఈశ్లోకముచేత ప్రపంచము
లేదనుటకాదు- ఇదియెట్లు తెలియఁబడుచున్నదంటిరేని, చెప్పెద
ము- ఈ ప్రకరణమున సంసారమునకు ముఖ్యమైన యౌషధమునుగా
యోగమును చెప్పి, ప్రత్యాహారము వఱకైన యోగాంగములను గూడఁ
జెప్పి, ధారణసిద్ధించుటకై శుభాశ్రయమును (ధ్యానము చేయవలసినదా
నిని) చెప్పుటకు పరబ్రహ్మమగు విష్ణువుయొక్క శక్తియని చెప్పఁబడెడి
రెండురూపములనును మూర్తము అమూర్తము అను విభాగముతోఁ దె
లియఁజేసి, మూడవశక్తియైన కర్మమనెడి యవిద్యచేత ఆవరింపఁబ
డిన అచేతనముతోఁ గూడిన క్షేత్రజ్ఞుఁడనెడి మూర్తవిభాగము భా
వనాత్రయముతోఁ (భావనాత్రయమనఁగా కర్మభావన బ్రహ్మభావన
ఉభయభావన అనునవి- కర్మభావనయనఁగా కర్మములను ఆచరిం
పవలయుననెడి యుద్దేశము- అదిగలవారు దేవతలు మనుష్యులు మొ
దలగువారు- బ్రహ్మభావనయనఁగా పరబ్రహ్మోపాసననుగుఱించి
న యుద్దేశము- అదిగలవారు సనందనాదులు- బ్రహ్మ మొదలగువారు రెం
డిటియందు నుద్దేశముగలవారుగాన ఉభయభావనతోఁ గూడినవారు-) జే
రియుండుటను అశుభమని చెప్పి, కర్మమనెడి అవిద్య లేనిదై అచేతనము
తోఁ జేరకయుండి జ్ఞానమాత్రస్వరూపమైన అమూర్తమనెడి రెండ
వ విభాగము యోగము సిద్ధించినవారలచే ధ్యానము చేయఁబడఁదగినద
గుటను యోగాభ్యాసము చేయువారి మనస్సునకు విషయముకాకపో
వుటంబట్టియు స్వతస్సిద్ధమైన పరిశుద్ధి లేకపోవుటంబట్టియు శుభా
శ్రయమగుటను నిషేధించి, పరశక్తిరూపమగు నీయమూర్తంబును అ
పరశక్తిరూపమగు క్షేత్రజ్ఞుఁడనెడి మూర్తంబును పరశక్తిరూపుఁడగు
నాత్మకు క్షేత్రజ్ఞత్వము కలుగుటకు హేతువైన మూడవశక్తియనె
డి కర్మస్వరూపంబగు నవిద్యయుననెడి ఈమూడుశక్తులకును ఆధా
రమై భగవంతునకు అసాధారణమై (రెండవవానికి లేనిదై వానికిమా

త్రిముకలదియై) ఆదిత్యవర్ణం (పురుషసూ॥) సూర్యునివంటివర్ణముగలది- ఇత్యాద్యుపనిషద్వాక్యములచేతసిద్ధించునదియునుమూర్తంబునగు రూపము శుభాశ్రయము (ధ్యానము చేయఁదగినది) అని చెప్పఁబడినది-అందు పరిశుద్ధమైన యాత్మస్వరూపము శుభాశ్రయమగుటకు తగకపోవుటను చెప్పుటకు ప్రత్యస్తమితభేదం యత్ అనెడి ఈశ్లోకము చెప్పఁబడుచున్నది- అట్లగుటనె, నతద్యోగయుజా శక్యం నృపచిన్తయితుం యుతః। ద్వితీయం విష్ణుసంజ్ఞస్య యోగిధ్యేయం పరంపదమ్॥౧॥ సమస్తాశ్శక్తయశ్చైతా నృప యత్ర ప్రతిష్ఠితాః। తద్విశ్వరూపవైరూప్యం రూపమన్యద్ధరేర్మహత్॥ (ఓరాజా! అదియోగాభ్యాసముచేయువానిచేతప హేతువువలన చింతింపశక్యముకానిదో, ఆహేతువువలన యోగులచే ధ్యానముచేయఁదగిన విష్ణువుయొక్క రెండవపరమపదము॥౧॥ ఓరాజా! ఈశక్తులన్నియు దేనియందునిలిచియున్నవో అదివిశ్వరూపమునకంటె విలక్షణమైనవిష్ణువుయొక్క మఱియొక్క గొప్పరూపము) అనియును చెప్పుచున్నాఁడు- అట్లె బ్రహ్మసనందనుఁడు మొదలగుజగత్తులోనివారు అవిద్యచేతనావరింపఁబడుటను శుభాశ్రయమగుటకు అర్హులు కాకపోవుటను చెప్పి, బద్ధులైనఆపిమ్మటను యోగముచేత బయలుపడిన జ్ఞానముకలవారగుటను స్వస్వరూపమునుబొందినవారలకును (ముక్తులకును) స్వతస్సిద్ధముగ పరిశుద్ధిలేకపోవుటను శుభాశ్రయత్వము, మహాత్మయగుశౌనకునిచే నిషేధింపఁబడినది- (విష్ణుధ॥) ఆబ్రహ్మస్తమ్బపర్యన్తా జగదన్తర్వ్యవస్థితాః। ప్రాణినః కర్మజనితసంసారవశవర్తినః॥౧॥ యతస్తతో న తే ధ్యానే ధ్యానినాముపకారకాః। అవిద్యాన్తర్గతాస్సర్వే తే హి సంసారగోచరాః॥౨॥ పశ్చాదుద్భూతబోధాశ్చ ధ్యానే నైవోపకారకాః। నైసర్గికో న వై బోధస్తేషామప్యన్యతో యతః॥౩॥ తస్మాత్తదమలం బ్రహ్మ నిసర్గాదేవ బోధవత్ (ఏందువలన బ్రహ్మమొదలుకొని గడ్డికాడవఱకును జగత్తులోనుండెడి ప్రాణులు కర్మమువలనఁగలిగిన సంసారము వశమునుండువారో, అందువలనవారు, ధ్యానముగలవారల ధ్యానమువిషయమున ఉపకరించువారుకారు-వారందఱును అవిద్యలోఁ జేరినవారై సంసారగోచరులుకదా- కొంతకాలముపైని కలిగినజ్ఞానముకలవారును(ముక్తులును) ధ్యానము విషయమున నుపకరించువారుకా

రు- ఎందువల్ల నంటేని వారికిని తెలివి స్వభావసిద్ధముకాదుగదా- మతియొకనివలనవచ్చినదిగదా- అందువలన ఆనిర్మలమైన బ్రహ్మమె స్వభావమునుబట్టి జ్ఞానముకలది-] ఇత్యాదికముచేత పరబ్రహ్మంబగు విష్ణువుయొక్క స్వాసాధారణమగురూపమె శుభాశ్రయమని చెప్పఁబడినది- కాఁబట్టి ఈశ్లోకమునభేదములేదనుట కనఁబడదు

౨౬. (విష్ణు॥౧॥౨॥౬॥) జ్ఞానస్వరూపమత్యన్తనిర్మలంపరమార్థతః। తమేవార్థస్వరూపేణ భ్రాన్తిదర్శనతస్స్థితమ్॥ అనుశ్లోకమున్నఁగూడ జ్ఞానముకంటె నితరమైనపదార్థమంతయును అసత్యమనుటప్రతిపాదింపఁబడలేదు- జ్ఞానస్వరూపుఁడైన యాత్మ, దేవమనుష్యాదులుగాఁదోచుట భ్రాంతియని, ఇంతమాత్రమే చెప్పఁబడుచున్నది- ముత్యపుచిప్ప వెండిగాఁదోచుట భ్రాంతియని చెప్పినమాత్రముచేత జగత్తులోనుండెడి వెండియంతయు అసత్యముకాదుగదా- జగత్తునకు బ్రహ్మముతోను సామానాధికరణ్యమునఐక్యముతోఁచుచున్నదగాన జ్ఞానస్వరూపమైన బ్రహ్మమునకు పదార్థములయాకారముకలుగుటభ్రాంతియని చెప్పినచో పదార్థసమూహమంతయు అసత్యముగుట చెప్పఁబడినదగునే, అంటిరేని, అదితెన్నగాదు- ఈశాస్త్రమునందు పరబ్రహ్మంబగువిష్ణువు అజ్ఞానాదిసమస్తదోషముల సంపర్కములేనివాఁడుగానును కల్యాణగుణములన్నియు స్వరూపముగాఁగలవాఁడుగానును గొప్పవిభూతికలవాఁడుగానును తెలియఁబడుటచేత అతనికిభ్రాంతి జ్ఞానము సంభవింపదు- సామానాధికరణ్యముచే నైక్యమును చెప్పుట బాధకములను సహింపదనియును విరుద్ధము కాదనియును వెంటనే తెలియఁజేయఁబడఁగలదు కాఁబట్టి ఈశ్లోకముగూడ వస్తుస్వరూపమునకు బాధకముగాదు-

౨౭. అటులన్నను (తై॥భృగు॥౧॥) యతోవాఇమానిభూతాని జాయన్తే। యేనజాతానిజీవన్తి। యత్ప్రయన్త్యభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ (దేనివలన ఈభూతములు పుట్టుచున్నవో, పుట్టినవిదేనివలన జీవించుచున్నవో, దేనినిపొందినవైలీనమగుచున్నవో, దానినివిచారింపుము. అదిబ్రహ్మము) అనిజగత్తుయొక్క జన్మము మొదలగు దానికికారణమగునది బ్రహ్మమని నిశ్చయింపఁబడఁగా, (మహా

భారతము) ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ (వేదము
ను ఇతిహాసపురాణములచేత పోషింపవలయును- అనఁగా వేదముయొం
క్క అర్థమును నిర్ణయింపవలయును- కొంచెము చదువుగలవానికి, వీఁ
డు నన్ను చెడఁగొట్టునని, వేదము బెదరుచున్నది-) అను శాస్త్రముచేత
ఈ అర్థమునకు ఇతిహాసపురాణములచేత ఉపబృంహణము చేయవల
సినదని తెలియఁబడుచున్నది- ఉపబృంహణమనఁగా వేదములన్నిటిని
వానియర్థములను ఎఱింగినవారును, తమ యోగమహిమచేత వేదము
యొక్క తత్త్వార్థమును ప్రత్యక్షీకరించినవారును, అగు వారి వాక్యము
లచేత తమకుఁ దెలిసిన వేదవాక్యములయర్థమును స్ఫుటపఱుచుట- భి
న్నశాఖలలోనునుండెడి వాక్యార్థము, స్వల్పభాగమును వినుటచేత తె
లియ శక్యము కానిదగుటను, ఆ ఋషివాక్యములను విడిచి నిశ్చయింప శక్యము
కానిదిగాన ఉపబృంహణము చేయవలసినదియే-

౮౮. అందు పులస్త్యుఁడును వసిష్ఠుఁడును వరములిచ్చుటచేఁ
గలిగిన పరదేవతా పారమార్థ్యజ్ఞానము అనఁగా ఈశ్వరతత్త్వజ్ఞా
నముగల మహాత్ముఁడగు పరాశరునివలన, తనకుఁ దెలిసిన వేదార్థమునకు
ఉపబృంహణమును కోరుచున్నవాఁడై, మైత్రేయుఁడు, (విష్ణు॥ ౧అం॥ ౧
అ॥ ॥శ్లో॥) సోహమిచ్ఛామి ధర్మజ్ఞ శ్రోతుం త్వత్తో యథా జగత్। బ
భూవ భూయశ్చ యథా మహాభాగ భవిష్యతి॥ ౧॥ యన్మయం చ జగద్బ్రహ్మ
న్ యతశ్చైతచ్చరాచరమ్। లీనమాసీద్యథా యత్ర లయమేష్యతి యత్ర
చ॥ ౨॥ (ఓ ధర్మములనెఱింగినవాఁడా! నీవలన ఆ నేను వినఁగోరుచున్నాఁ
డను- జగత్తు ఎట్లు కలిగెనో వెండియు నెట్లు కలుగఁగలదో॥ ౧॥ ఓ బ్రహ్మ
ఋషీ! జగత్తు ఎవ్వఁడు ఆత్మగాఁ గలదియో- ఈ జంగమస్థావరములు
ఎవ్వనివలనఁ గలిగినవియో- ఎవ్వనియందు ఎట్లు లీనమయ్యెనో- ఎవ్వని
యందులయమును పొందఁగలదో॥ ౨॥) ఇది మొదలగు గ్రంథముచేత ప్రశ్న
మును చేసెను- దీనిలో బ్రహ్మము యొక్క స్వరూపవిశేషంబులును వి
భూతిభేదప్రకారంబులును ఆరాధనస్వరూపంబును ఫలవిశేషంబును
అడుగఁబడినవి- బ్రహ్మస్వరూపవిశేషప్రశ్నంబులలో యతశ్చైతచ్చ
రాచరమ్ (ఈ జంగమస్థావరరూపమైన జగత్తు ఎవ్వనివలనఁ గలిగినదో) అ
ని నిమిత్తోపాదానకారణంబులనడుగుటచే యన్మయమ్ అనుదానిచే

త సృష్టిస్థితిలయములఁ బొందెడు జగత్తు ఎవ్వఁడు ఆత్మగాఁ గలదియని అడుగఁబడినదైనది- దానికి ఉత్తరము (విష్ణు॥౧౮౦॥౧౮॥ శ్లో॥) జగచ్చ సః (జగత్తు అతఁడె) అని- ఈ తాదాత్మ్యము అనఁగా ఐక్యము అంతర్యామిరూపముగా ఆత్మయై వ్యాపించుటచేతఁ గలిగినదిగాని వ్యాపింపఁబడునదియు వ్యాపించువాఁడును ఒక్కవస్తువగుటచేఁ గలిగినదిగాదు- యన్మయమ్ అను ప్రశ్నమునకు ఉత్తరముగదా జగచ్చ సః అను సామానాధికరణ్యము- యన్మయమ్ అనునప్పుడు మయట్టు (మయ అనునది) వికారార్థకముగాదు- అట్లైనచో వేఱుగా ప్రశ్నము చేయుట వ్యర్థమగును- ప్రాణమయాది శబ్దములయందువలె స్వార్థికంబును (అర్థము లేనిదియును) కాదు- అట్లైనచో జగచ్చ సః అనునుత్తరము సరిపడదు- అప్పుడు విష్ణువే అని ఉత్తరముండును- కాఁబట్టి ప్రాచుర్యార్థమందె (అధికముగాఁ గలది అనునర్థమందె) (అష్టా॥౫॥౪॥౨౧॥) తత్ప్రకృతవచనే మయట్ అను సూత్రముచేత మయట్ప్రత్యయము- సమస్తమైన జగత్తును ఆ బ్రహ్మంబునకు శరీరమగుటచే ఆ బ్రహ్మము ప్రచురముగాఁ గలదిగో- కాఁబట్టి యన్మయమ్ అనుదానికి ప్రత్యుత్తరమైన జగచ్చ సః అనెడి సామానాధికరణ్యము జగత్తును బ్రహ్మంబును వరుసగా శరీరంబును ఆత్మయునగుటచేఁ గలిగినదని నిశ్చయింపఁబడుచున్నది- అట్లు కాక నిర్విశేష వస్తువును తెలియఁజేయుదానిగా శాస్త్రమును ఒప్పినయెడను ఈ ప్రశ్నోత్తరములన్నియు సందర్భింపవు- వానివివరణంబగు శాస్త్రంబంతయుంగూడ సరిపడదు- అట్లైనచో ప్రపంచభ్రాంతికి ఆధారంబెద్ది? అనియిట్లు ఒక్క ప్రశ్నంబునకు నిర్విశేషజ్ఞానమాత్రంబేయని ఒక్కయుత్తరంబే ఉండును- జగత్తునకును బ్రహ్మంబునకును సామానాధికరణ్యము ఒక్కవస్తువగుటనే తెలియఁజేయుచో సత్యసంకల్పత్వము మొదలగు కల్యాణగుణంబులకు (సుగుణంబులకు) ముఖ్యాధారమగుటయు హేయగుణంబులకు (దుర్గుణంబులకు) ప్రతికోటియగుటయు బాధింపఁబడును- బ్రహ్మము అశుభంబులన్నిటికిని ఆధారంబగును- ఈ సామాధికరణ్యము ఆత్మయును శరీరంబునగుటయందె ముఖ్యముగాఁ బ్రవర్తించునని స్థాపింపఁబడఁగలదు-

౮౯. కాఁబట్టి (విష్ణు।౧అం॥౧అ। శ్లో॥) విష్ణోస్సకాశాదుద్భూతం జగత్తత్రైవచస్థితమ్। స్థితిసంయమకర్తాసౌజగతోస్యజగచ్చసః॥ (జగత్తువిష్ణువువద్దనుండిపుట్టినది-అతనియందేయున్నది- ఈజగత్తునకు ఉనికిని నియమనమును చేయువాఁడు- జగత్తునుఅతఁడె) అనిసంగ్రహముగాఁ జెప్పినయంశమును (విష్ణు॥౧అం॥౨అ॥ శ్లో॥) పరఃపరాణాం (గొప్పవానికి గొప్పవాఁడు) అని మొదలుపెట్టి విస్తరముగాఁ జెప్పుటకు, పరబ్రహ్మంబును భగవంతుండును నగువిష్ణువును తనరూపముతోనున్నవానిని (విష్ణు॥౧అం॥౨అ॥౧శ్లో॥) అవికారాయ (ప్రకారములేనివానికి) అనుశ్లోకముచేత మొదటను నమస్కరించి, అతనిని హిరణ్యగర్భుఁడును (బ్రహ్మయును) తనయవతారంబును రుద్రుఁడును అనెడి త్రిమూర్తులును, ప్రధానంబును (ప్రకృతియును) క్షేత్రజ్ఞుల (జీవుల) సమష్టియును వ్యష్టియును అనునీరూపమున నున్న వానినిఁ స్మరింపుచున్నాఁడు- అంత (విష్ణు॥౧అం॥౨అ॥ శ్లో॥) జ్ఞానస్వరూపమ్ అను నీశ్లోకము క్షేత్రజ్ఞవ్యష్టిరూపముగానున్న పరమాత్మయొక్క స్వరూపమును చెప్పుచున్నది- కాఁబట్టి ఇందు నిర్విశేషవస్తువుతోఁచుట లేదు-

౯౦. నిర్విశేషజ్ఞానస్వరూపంబగు బ్రహ్మముఅధిష్ఠానము (ఆధారము) గాఁగలభ్రాంతిని తెలియఁజేయునదియె శాస్త్రమైనయెడను (విష్ణు।౧అం॥౩అ॥౧శ్లో॥) నిర్గుణస్యాప్రమేయస్యశుద్ధస్యాప్యమలాత్మనః। కథంసర్గాదికర్తృత్వం బ్రహ్మణోభ్యుపగమ్యతే॥ (సత్త్వరజస్తమోగుణంబులు లేనివాఁడును ప్రమాణములచేఁదెలియఁబడనివాఁడును పరిశుద్ధమైనవాఁడును నిర్మలమైనస్వరూపముగలవాఁడును అగుపరబ్రహ్మమునకు సృష్ట్యాదికర్తృత్వముఎట్లు అంగీకరింపఁబడుచున్నది) అనుప్రశ్నంబును (విష్ణు॥౧అం॥౩అ॥౨శ్లో॥) శక్తయస్సర్వభావానామచింత్యజ్ఞానగోచరాః। యతోతో బ్రహ్మణస్తాస్తు సర్గాద్యాభావశక్తయః। భవంతితపతాంశ్రేష్ఠ పావకస్యయథోష్ణతా॥ (ఓమునిశ్రేష్ఠుఁడా అన్నివస్తువులశక్తులు ఊహింపశక్యముగాని జ్ఞానమునకుగోచరములైనవిగాన బ్రహ్మమునకును ఆసృష్ట్యాదులును వస్తుశక్తులగుచున్నవి- అగ్నికి వేఁడికలిగినట్లు) అనుపరిహారంబును సంభవింపవు- ఆత్మైనచో.

నిర్గుణంబగుబ్రహ్మమునకు సృష్ట్యాదికర్తృత్వమెట్లు? బ్రహ్మమునకు సృష్టి పారమార్థికముకాదు, మరేమన్నను భ్రాంతిచేత కల్పింపఁబడినదే, అనిప్రశ్నోత్తరములుండవలయును. పుట్టుట మొదలగుకార్యము, సత్త్వాదిగుణములతోఁగూడినవారును, అపరిపూర్ణులును, కర్మాధీనులును (కర్మములకులోఁగియున్నవారును) అగువారియందె కానంబడుచున్నదిగాన, సత్త్వాదిగుణములులేనివాఁడును పరిపూర్ణుఁడును కర్మవశ్యుఁడు కానివాఁడును కర్మములతోడి సంబంధమునుఁదగనివాఁడును అగువానికి సృష్టి మొదలగువానికి కర్తృత్వము ఎట్లంగీకరింపఁబడుచున్నది? అనిప్రశ్నము. తనఁబడెడివానియన్నిటికంటె విలక్షణమగు బ్రహ్మమునకు వెనుకఁజెప్పఁబడిన స్వభావముకలిగియుండుటగనె, జలాదులకంటె విలక్షణంబగు అగ్ని మొదలగుదానికి వేఁడిమొదలగు శక్తులుకలుగుటవలె, సర్వశక్తులుకలిగియుండుట విరోధింపదు, అనియుత్తరము.

౯౧. (విష్ణు॥౧॥౪॥౩౮॥) పరమార్థస్త్వమేవైకో నాన్యోఽస్తి జగతఃపతే అనునదిగూడ సమస్తంబును అసత్యమనుటను చెప్పదు. మరి యేమన్నను, సమస్తంబును అతఁడు (ఈశ్వరుఁడు) ఆత్మగాఁ గలదిగాన ఆతనిని విడిచియున్నది అపరమార్థమనుటను చెప్పుచున్నది. ఆయంశమునె (విష్ణు॥౧॥౪॥౩౯॥) తవైష మహిమా యేన వ్యాప్తమేతచ్చరాచరమ్ అనునది ఉపపాదించుచున్నది. ఏహేతువు చేత ఈజంగమస్థావరరూపమగు జగత్తంతయును నీచేత వ్యాపింపఁబడినదో, ఇందువలన ఇదియంతయు నీవు ఆత్మగాఁ గలది. కాఁబట్టి నీకంటె ఇతరమైనది ఒకటియులేదు. ఇందువలన అన్నిటికిని ఆత్మవగుటచే నీవొకఁడవే పరమార్థమైనవాఁడవు. కాఁగా అన్నిటను వ్యాపించుటయనునదియేది గలదో ఇది నీ మహిమ, అను నీ యంశము చెప్పఁబడెను. అట్లుగాని బోధదని భ్రాంతియని చెప్పవలసినది. జగతఃపతే (జగత్తునకు అధిపతియైనవాఁడా) త్వమ్ (నీవు) ఈ మొదలగు పదములకు లక్షణ (అముఖ్యార్థము చెప్పుట) యును కలుగును. లీలచేత భూమినెత్తిన భగవంతుండగు మహావరాహమును స్తుతించుట యనెడి ప్రకరణమునకు విరోధముగూడవచ్చును.

౮౨. (విష్ణు॥ ౨॥ ౧౪॥ ౩౧॥) తస్యాత్మపరదేహేషు సతోఽప్యేకమయం హి యత్। విజ్ఞానం పరమార్థో హి ద్వైతినోఽతథ్యదర్శినః అను శ్లోకమునందు ఆత్మలును జ్ఞానమొక్కటియే స్వరూపముగాఁ గలుగుటచే సమానులగుచుండఁగా దేవమనుష్యాదిప్రకృతిపరిణామవిశేషరూపములగు శరీరసంబంధములచేఁ గలిగిన దేవాదిరూపముగాఁ దలంచుటయనెడి భేదజ్ఞానము అసత్యము అని చెప్పఁబడుచున్నది- శరీరములయందున్నదియు నాత్మలయందున్నదియు నగు భేదమును నిషేధింపఁబడలేదు- దేవమనుష్యాదిరూపములు అనేకములును విచిత్రములును నగు శరీరములయందుండెడి యాత్మవస్తువంతయు సమానమే యని యర్థము- ఈ యంశము (భగ ॥) శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః (పండితులు కుక్కయందును కుక్కను వండు వానియందును ఆత్మను సమముగాఁ జూచువారు) (భగ॥ ॥) నిర్దోషం హి సమం బ్రహ్మ (ఆత్మస్వరూపము దోషములు లేనిదియు సమమైనదియును) ఇత్యాదులయందు భగవంతునిచేఁ జెప్పఁబడినది- తస్యాత్మపరదేహేషు సతోఽపి అని దేహముకంటె భిన్నమైన వస్తువునందే, తాను, తనకంటె నితరుఁడు, అనెడి విభాగము చెప్పఁబడినది గదా-

౮౩. (విష్ణు॥ ౨॥ ౧౩॥ ౮౬॥) యద్యన్యోఽస్తి పరః కోఽపి మత్తః పార్థివసత్తమ। తదైషోఽహమయం చాన్యో వక్తుమేవమపీష్యతే అను శ్లోకమునఁ గూడ నాత్మ యొక్కటియే యగుట తోఁచుటలేదు- నాకంటె పరుఁడును అన్యుఁడు నగు నొకఁడుండు నేని అని యొక్క యర్థమునందే పరశబ్దంబును అన్యశబ్దంబును ప్రయోగించుట సంభవింపదు గాన వానిలో పరశబ్దము తనకంటె నితరుఁడగు నాత్మను జెప్పునది- అన్యశబ్దము ఆయాత్మ కూడ జ్ఞానమొక్కటియె ఆకారముగాఁ గలదగుటవలన మఱియొక్క యాకారముకలుగుటను నిషేధించుట కొఱకైనది- ఫలితార్థమేమన్నను, నాకంటె నితరుఁడగు నొకయాత్మ నాయాకారమగు జ్ఞానాకారముకంటె నితరమైన యాకారముకలవాఁడుగా నుండునేని, అప్పుడు, నేను ఇట్టి యాకారముగలవాఁడను, ఈతఁడు మఱియొక్క విధమైన యాకారముగలవాఁడు అని చెప్పశక్యమగును- ఇట్లు లేదు గదా- అందఱును జ్ఞానమొక్కటియె ఆకారముగాఁ గలవారగుటచేత సమానులే యగుట ఇం

దుకు హేతువు-

౯౮. (విష్ణు॥౨॥౧౪॥౩౨॥) వేణురన్ధ్రవిభేదేనభేదష్షడ్జాదిసంజ్ఞితః। అభేదవ్యాపినోవాయోస్తథాఽసౌపరమాత్మనః॥ అనుచోటఁగూడ ఆత్మలయాకారవైషమ్యము స్వరూపమునఁ గలిగినది కాదు, మఱియేమన్నను, దేవాదశరీరములలోఁ బ్రవేశించుటవలనఁగలిగినది, అని చెప్పఁబడుచున్నది- ఆత్మైక్యము చెప్పఁబడుటలేమ- దృష్టాంతమునఁగూడ అనేకరంధ్రములలోనుండెడివానికి (వాయువులకు) స్వరూపైక్యములేదు- మఱియేమన్నను, ఆకారసామ్యమె- వాయువులగుటచేనొక్కయాకారముగలిగినానుండెడి వానికి వేఱువేఱురంధ్రములనుండి బయలువెడలుటచేతఁగలిగినదిగదా షడ్జము మొదలగు వేఱువేఱుసంజ్ఞలుకలుగుట- ఇట్లే ఆత్మలకును దేవాదిసంజ్ఞాభేదము- తేజస్సు జలము పృథివీని్రవ్యములయంశములైన పదార్థములకు ఆయాద్రవ్యమగుటనె ఐక్యముకాని స్వరూపమునవైక్యములేదు- అట్లే వాయుసంబంధులగు నంశములకుఁగూడ స్వరూపభేదము తప్పనిదె-

౫. (విష్ణుపు౨అం॥౧౬అ॥౨౩-౨౪శ్లో॥) సోహఁసచత్వంసమేతదాత్మ స్వరూపంత్యజభేదమోహమ్। ఇతీరితస్తేనసరాజవర్యస్తత్యాజభేదం పరమార్థదృష్టిః॥ అనుశ్లోకమున ఆత్మలంటియొక్కయు వెనుకఁజెప్పఁబడినజ్ఞానస్వరూపమును తచ్ఛబ్దముచేత(సః అనుదానిచేత) నెత్తికొనిదానిసామానాధికరణ్యమునఅహంత్వం మొదలగు వానియర్థములకు జ్ఞానమెస్వరూపమని ఉపసంహరింపుచు దేవతలుమొదలగువారల యాకారభేదముపట్టి వచ్చినయాత్మలయందలి భేదపుమోహమును (అజ్ఞానమును) విడువుమని చెప్పుచున్నాఁడు- అట్లు కానిచో, దేహముకంటెవేఱయినయుపదేశింపవలసినదానిస్వరూపమున, నేను నీవు ఇదియంతయును ఆత్మస్వరూపమనిభేదమును జెప్పుటసంభవింపదు-నేను నీవు మొదలగు శబ్దములకు ఉపలక్ష్యమగు, ఇదియంతయు నాత్మస్వరూపమునుదానితో, సామానాధికరణ్యముండుటవలన ఉపలక్షణమగుటయు కుదురదు- అతఁడును ఉపదేశానుసారముగాఁ జేసెనని, తత్యాజభేదంపరమార్థదృష్టిః అనుదానిచేఁ జెప్పఁబడినది- ఈనిశ్చయమెట్లన్నను, ఉపదేశము, దేహమును

నాత్మను వేర్పఱుచునదియగుటవలన. అది(విష్ణు॥౨॥౧౩౫॥) పిణ్డః పృథగ్యతః పుంసశ్శిరః పాణ్యాదిలక్షణః(ఏహేతువువలన శిరస్సు చేతులు మొదలగునవి గుఱుతుగాఁగల శరీరముపురుషునికంటె వేఱో) అని ఆరంభించుటవలనఁ దెలియఁబడుచున్నది-

౯౬. (విష్ణుపు॥౯॥౯॥౯౬॥) విభేదజనకే జ్ఞానే నాశమాత్యన్తికం గతే। ఆత్మనో బ్రహ్మణో భేదమసన్తం కః కరిష్యతి, అనునదిగూడ ఆత్మలు న్నియునొకఁటియని తెలియఁజేయునదిగాదు- జీవుఁడును పరమాత్మయు నొకఁటియగుటను తెలియఁజేయునదియునుగాదు- ఆత్మలన్నియు నొకఁటియగుట వెనుకఁ జెప్పఁబడినతీరునఁ గరిపడనిదియె- జీవాత్మపరమాత్మలస్వరూపైక్యముకూడ దేహమునకు నాత్మనువలె సంభవింపనిదె- ఇందుశ్రుతికూడఁగలదు (ముండ॥౩॥౧॥౧॥) ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానంవృక్షంపరిషస్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥ (సమానమైన గుణములుకలిగియునుకూడఁదిరుగునవియునగు రెండుపక్షులు ఒకఁటిచెట్టును ఆశ్రయించియున్నవి- వానిలోనొకఁటి మధురమైన పండునుతినుచున్నది- రెండవదియొకఁటితినకున్నదై ప్రకాశింపుచున్నది- పక్షులనఁగా జీవపరమాత్మయును- చెట్టనఁగా శరీరము-పండనఁగాకర్మఫలము-) (వల్లి॥౩॥౧॥) ఋతంపిబన్తౌసుకృతస్యలోకే గుహాం ప్రవిష్టౌ పరమేపరార్ధ్యే। ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో యేచత్రిణాచికేతాః॥ (ఐదుఅగ్నులుకలవారును, త్రిణాచికేతులును ఎవ్వరో, అట్టి బ్రహ్మజ్ఞులు, నీడవెలుగువంటివారైన జీవాత్మపరమాత్మలను, మంచికర్మముయొకఁటి లోకమున పుణ్యకర్మమును అనుభవింపుచున్నవారలనుగానును, హృదయరంధ్రమును ప్రవేశించియున్నవారలనుగానును, దానిలో బ్రశస్తమైనపరమాకాశమునసున్నవారలనుగానును, చెప్పుచున్నారు- పరమాత్మపుణ్యము ననుభవింపకపోయినను జీవులచేననుభవింపఁజేయుటవలన నిట్లుచెప్పఁబడెను-) (తైత్తి॥ ఆర॥) అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా। (లోపలఁబ్రవేశించినవాఁడె జనులను శాసించువాఁడు- అన్నిటకినాత్మయైనవాఁడు-) ఇట్టిశ్రుతులుగలవు- ఈశాస్త్రమునఁగూడ, (విష్ణుపు॥౬॥౭॥౭౩॥) సకలభూతప్రకృతింవికారా

